శ్రీ ర స్తు.

శ్రీకృష్ణాయనమః.

# రెట్టమతశాస్త్రము

ఆనువాదసహితం.

## ప్రథమాశ్వాసము.

తేది.........

శ్రీరత్నాకర సంభవోక్తికలనం జెన్నొంది గర్గాది మ । ర్త్యారూ
ఢింగని మేఘమాలిక సముద్యత్కాంతిరాణించిన । త్త్యోరుశ్రీమహిరావ్యయస
స్థితిగదర్ జ్యోతిర్మయుండైన సీ । తారామప్రభుడేలు వేంకటనరేంద్ర శ్రే
ష్ఠు నెల్లప్పుడున్ ॥ శా॥ లీలాస్యోపజితామృతాంశుకళ పాళింగేలుదోయెత్తి
యుద్వేల్లప్రీతిహరించు గోరికుచముల్వీక్షించు నాసక్తిద । త్కాలక్షేపము
గోరుప్రామిటిపురాధీశుండు భోగీశ్వరుం । డేలుందిమ్మనృపాలు వేంకటధరిత్రీ
శాగ్రణిన్నిత్యమున్ ॥ చ॥ ఎలమిసమస్తభాగ్యసుమహీశుడు ప్రస్తయువేల్పు
పెద్దనా । జెలగుచునుండు బ్రహ్మసువిచిత్రము గాదనమాటలోపల । న్నలగగ
జేయుభారతి సమిద్ధకళావతి పెద్దతిమ్మభూ । తలపతి వేంకటేంద్రునరుధన్యత
లోక్తులొసంగు వేడుకన్ ॥ మ॥ కలుషధ్వాంతవికర్తనుండగుచు విఘ్నస్వా
ముయైసర్వమం । గళ సర్వజ్ఞుడుగారవింప దివౌకశ్రేణికాపూజ్యుడై । యల
రున్ సిద్ధిగణేశ్వరుండొసగు నుద్యత్కార్య సంసిద్ధిబు । ద్ధిలసత్ప్రౌఢిమమిచ్చు
వేంకటధరిత్రీనాథుకెవ్వేళలన్ ॥ శా॥ శ్రీరంగేశ్వరుడెయితం డవిబుధుల్సే
వింపగాబోధ వి । ద్యారూఢోన్నతిమించు ధన్యుడహితా హంకార విధ్వంస
కుం । గూరేంద్రాన్వయు వార్ధిచంద్రగురుముఖ్యున్నేరుధీరున్మహో । దా
రున్వేంకట భట్టరార్యు దలతుం దాత్పర్యమింపొందగన్ ॥ గీ॥ ఘనుల
ప్రాచేతనవ్యాస కాళిదాస । భారవిమయూరనన్నయభట్టతిక్క । యజ్వనా
శంభుదాసునినభినుతింతు । సంస్కృతాంధ్రకవిత్వవిశారదులను ॥ వ॥ ఆ యి
ష్టదేవతాప్రార్థనంబును బురాతన సుకవిస్తోత్రంబును గావించి యేనొక్క
కృతి సకలజనశ్రుతిహితంబుగా నొనర్పంబూనియున్న సమయంబున ॥ సీ॥
శ్రీమదహోబిలస్వామి మహారాజ్య రక్షకుండగుచు నేరాజువెలయు । నభి
రామ కామందకాఖ్యసత్కావ్య రత్నమునకు నేరాజు నాథుడయ్యె । జాన
కీనాయకచరణసంసేవనాప్రౌఢిచే నారాజు ప్రబలుసిరుల । నెరయూరిపురజ
రాధీశాదిబహుబిరుదాంకుడై యేరాజు యశముగాంచె । నతడుకోండ్రా
జుతిమ్మభూపతివరేణ్యు । తనయ పెదతిమ్మరాజ వతంసగర్భ । వార్ధి చంద్రుం
డుసత్కుల వర్ధనుండు । సతతివిభవుండు వేంకటాత్మవిభుండు ॥ క॥ ఒక
నాడునిఖిలకోవిద । నుకవిహితామాత్యబంధునుతవీరభట । ప్రకరముగొలువ
గగొలువుం । డికథాప్రస్తావమాత్మ నివ్వటిలంగన్ ॥ గీ॥ రాయకవియవ్వా

నయ్యలరాజవంశు । ననఘుపిన్నక్క విభుపుత్రునయ్యలాఖ్యు । నాగఘను
సూనుభాస్కరనామధేయు। గరుణదళుకొత్త రావించి గారవించి॥ వ॥ త
త్కాలోచిత ప్రసంగంబున నిట్లనియె॥ గీ॥ ఘనతవిజ్ఞాననిధి రెట్టఘనుఁడ వము
న్న । జెలఁగఁ గన్నడభాషను జెప్పినట్టి । శాస్త్రమంతయు నేను నీజనులువొఁగ
డ। దెనుఁగుభాషయొనర్పంగ దివురునపుడు॥ సీ॥ పరిపూర్ణధవళాంగ భవఘనీ
దివ్యతేజమునిమించినశంఖ చక్రములను । గరయుగ్మమునఁ దాల్చి కనకపీ
తముపాణి యుగమునననూదియత్యుజ్జ్వలముగ । నిజహస్తమున రెండుభుజ
మునపై శోణ కాంతులెంతయు సత్ప్రకాశముగను । గొంచెంబు లోచెవిఁగొ
ణకల నెఱ్ఱని చాయల మెఱయు కేసరచయంబు । నురిగరపువెంద్రుకలరీతిను
ల్లసిల్లు । రామచంద్రుం డహోబిలస్వామియగుచు । గరుణనాముందట
నుబొడఁగ నట్టినవ్యాహృదయ సూక్తుల నానతిచ్చె నిట్లు॥ క॥ నీవుదలంచినతల
పును। భావహము యశోనిధాన మటుగావ్రాద । ద్భ్యావినుతమతముగా
వ్యము। గావేంకటనృపవరిగ్రహముగొనువత్సా॥ గీ॥ అని ప్రసాధించి నాఁడు
మీరవ్విశేషములను। ప్రతిపద్యమును మందకితముగాఁగ । నాంధ్రభాషా
నిహూషిగావ్యంబు జేయు । డఖిలజనులకు నుపకారమై చెలంగ॥ వ॥ విశేషిం
చి మీరలు శ్రీరఘునాయకదయాలబ్ధసారస్వతులును రఘువీరశతకనిర్మాణ
కర్మరాయకవితిప్ప నార్యపాలకులును మదీయాశ్రితులు నగుటం జేసి భ
వత్కవిత్వంబు మా కభిమతంబయి యుండు ననిన నంగీకరించి యారె
ట్టరభీమమూరు రాయర బసవశంకరగు తిహన్నిబ్బరగండ మానవీయా
తురమహాబిరుదాంకుండును విక్రమసాహసాంకుండును గాశ్యపగోత్రపవి
త్రుండును కొండ్రాజు తిమ్మరాజపుత్రుండు నయిన వేంకట ధరణీకళత్రు
నకు నంకితంబుగా నేరచియింపంబూనిన ఇకావ్యంబున కుతిలకాయ
మానంబగు తదీయవంశావతారం బెట్టిదనిన.

### కృతినాయక వంశావళి.

క॥ భానుడు శాశ్వత బహుసం। తానుడు రిపునికర తిమిరి దళనఘ
టూద్య। ద్భానుడు సంతత కరుణా । సూనుడు విలసిల్లు విర్జరోత్తము డ
గుచున్ ॥ క॥అతనికి వైవస్వతమును । వతనికి నిక్ష్వాకు డతని వంశమున
రగు। క్షితి పతి యతని కులంబున। గతకలుషుడు రాఘవుండు గ్రహమున
బొడమెన్॥ క॥ ఆరామ భద్రునకు గుశ । వీరుండు జనియించె నఖిలవిబుధ
ప్రకరా। దారుం డాతని కులమున। భూరి గుణోజ్జ్వలుడు కొండ భూపతి
పుట్టెన్ ॥ శా॥ఆకొండ క్షితి పాల చంద్రుడు మహాద్యత్కీర్తి సంపన్నుడై
[illegible]కా తీత పరీత భూతన సుధీలోక స్తుతప్రాపుడై । కంజాక్షున్య పదాబ్జ
భక్తిచతురుండై నిత్యసందానని । ష్టాకారుణ్యనయాదిసద్గుణసమాజసూ

ర్తిమించెఁ ధరన్॥ ఉ॥ ఆనరనాథ పుంగవున కాశ్రితరక్షణ తత్పరుండునౌ
న్మానసుయోధనుండు నృప మాన్యుడు రాజ కిరీటవిస్ఫుర। ద్దానకళాపరాజిత
సుధాకర మేఘదధీచిఖేచరాం। భోనిధితిమ్మభూతలవిభుండుదయించెజగత్ప్ర
సిద్ధుడై॥ గీ॥ విమలగుణనిధితిమ్మభూ విభునిమార్గ। రాజవర్యునిపుత్రికా రత్న
మయిన। యక్కమాదేవివై వాహ్యాయయిచెలంగె। జలధిసుత బెండ్లి యాడిన
శౌరిరీతి॥ క॥ ఆదంపతులకుబొడమెద। యాదాక్షిణ్యాంబురాశి హరిభక్తిన
ప్రా। హ్లాదుడు సతతత్యాగ। శ్రీదుడు పెదతిమ్మరాజుక్షితి జనులలరన్॥ మ॥ పెద
ళించెస్సడిరా ధరిత్రితన భూవిఖ్యాతు లేమందున। భ్యుదయంబంది యశంబు
గాంచెమహీలోనుద్దండ విద్వేషులం। గదదోర్భృత్తుల దోలిగెల్చె సిరులంగన్న
ట్టి గొన్నారిజుశ్రీ। పెదతిమ్మక్షితి పాలమౌళికెనయే పృథ్వీపతుల్దిక్కులన్॥
గీ॥ అట్టిపెదతిమ్మరాజు ధైర్యాద్రిరాజు। మంగవిభుగర్వశౌరి మోయనగు
మారు। సంగన శిరోమణిని పాపసంగమాఖ్య। ప్రేమవరియించె విభవాభి
రాముడగుచు॥ క॥ గుణనిధియగు తిక్కన్నా। మణిజనకుఁ బోధజనకు
మంజులభాషా। ఫణివరురణవిజయార్జును। బ్రణుతింపదరంబె గురువపార్థి
వవర్యున్॥ సీ॥ పృథులవిక్రమశాలి పెదసంగ నృపతియు సత్యసంధుడు చి
నసంగరాజు। ధర్మగుణాఢ్యుండు తిమ్మభూపాలుండు రుచిరకీర్తిధరుండు రు
ద్రఘనుడు। శ్రీధనాంకణకిరీటబసవ నరేంద్రుండు స్థిరభాగ్యనిధి పెదచిట్ట
ఘనుడు। సింధుగాంభీర్యుండు చినచిట్టధన్యుండు సతతధన్యుడు పొట్టిసంగ
శౌరి। కలితతేజుండుపాపసంగప్రభుండు। ననగబరగినదొమ్మండు తనయవరు
ల। గాంచివిజయసంశీలుడై మించెనార। మంగరాజన్యగురువసమాఖ్యవరుం
డు॥ క॥ ఆగురువరాజవరునకు। త్యాగసముద్రునకు నలుడయి వెలసెధరా।
భాగధురంధంతనునా। భాగుడు పెదతిమ్మరాజుప్రజలునుతింపన్॥ గీ॥ ధీరశం
కరుడా పెదతిమ్మరాజు। లలితగుణములనుభయకులప్రసిద్ధ। యైన యలపాప
సంగమాహ్వాయబతివ్ర। తాశిరోమణియందు ముదంబుతోడ॥ వ॥ వరపుర
భంజనోగ్రుడయి భాసిరుదాసరరాజశేఖరుం। దిరుపతిదారుణీశుగుల దీపకు
వేంకటపార్థివోత్తమున్। గురుయశుకృష్ణయ ప్రభునికొండలధీరుని బాహు
శౌర్యసు। స్థిరరఘునాథశౌరిజినతిమ్మనృపాలుని గాంచెధన్యుడై॥ వ॥ వా
రలలోన॥ ఉ॥ కేసరినైనశౌర్యమున గేరునుగీర్తివిహారలీలగం। గానరిచంద్ర
శేఖరుల కాంతులగల్వల రాచవారికెం। తేసరివచ్చుతిమ్మధరణీనరనందవర
త్నమైనమా। దాసరిరాజవర్యుని బుధస్తుతచర్యుని నెన్నశక్యమే॥ చ॥
గురుపతిచాతురింభుజగకుంజరుగేరుచు వార్థికన్యకా। వరునతిభక్తి గొల్చు
నని వారితమాన విశేషసంపదన్। గురుపతిబోలుచున్న లగు కోవిద
పెద తిమ్మశౌరి మా। తిరుపతిపార్థివోత్తముడు ధీరవరేణ్యుడు రాజమా

తుడే॥ ఉ॥ రాజధరున్భజించు ఖగరాజతురంగుని సంస్మరించునం । దాజమద
గ్ని రాముడన ధాత్రివహించు హాలాయుధామహా । త్మ్మాజసుధాంశుజిత్వ
రల నద్ఘనకీర్తివహించునట్టికొం । డ్రాజవతంసుతిమ్మనృపరత్నము వేంకట
రాజువేడుకన్॥ ఉ॥ జిష్ణుని ధిక్కరించుచు ప్రసిద్ధికినెక్కిన వైభవంబునన్ ।
జిష్ణునిధిక్కరించురిపుజిత్వర బాహు పరాక్రమంబున । జిష్ణునిసంతతంబును
భజించుచు తిమ్మనరేంద్రుడైన మా । కృష్ణనృపాలశేఖరుడ కీర్తి ధురంధరు
డెంతపుణ్యుడో॥ ఉ॥ చండలసత్ప్రతాప నయచారువికాస విలాసరేఖ
మా। త్రాండలతాంతసాయకుల దార్కొని మార్కొని దాల్మికల్మినా ।
కొండలజేనతిమ్మనృప కుంజరసూనుడు కొండలయ్యయా । తండర శ్రీధ
రాంశజుడెతప్పడుశోషణబుద్ధిసంపదన్॥ ఉ॥ ధీరనృపావతంసమును ధీమణి
నీయుడ నూనదానవి। ద్వారసికత్వభూషణుడు ధన్యగుణాఢ్యుడు తిమ్మ
శౌరిమా । శ్రీరఘునాధ రాజభళిరే శరణాగత రక్షణంబునం । దాంగు
రానునంతటి కృతార్థుడతండొక రాజమాత్రుడే॥ చ॥ స్థిరమతి పెద్ద తిమ్మ
జగతీపరమాళితపః ఫలంబు సువర్ణగుణబంధుకల్పకము కోమలకీర్తివఘూ
ప్రియుండుభా । స్వర వినయాంగనాయుతుడు శాశ్వతరాగవభక్తిశాలిశ్రీ ।
తిరుమలరాజురాజిలు వితర్ణగుణాశ్రయవిక్రమంబునన్॥ క॥ కృతియై రమణీ
యశుభా । కృతియై యభయ ప్రదాన కృతిసన్మతియై । నుతికెక్కెను
పెద్దతిమ్మ। క్షితిపతి తిరుమలనృపాల సింహుడుజగతీ॥ చ॥ వితతపరాక్రమక్రమ
వివేకవిశిష్టజనాజనక్షనూ। ధృతినిధిపెద్దతిమ్మ మనుజేంద్రునిశ్రీచినతిమ్మ మే
దినీ। పతితిలకంబుబొమ్మ నరపాలుని పర్వతరాజపుత్రినా । యతకుల శీల
మానవతిదాబళ దేవివరించి వేడుకన్॥ గీ॥ ఆవధూమణియో బన్న య
నెడిఘనుడు । ప్రతిభ చెన్నొందు వేంకట పతివిభుండు । తిరుమలేంద్రుడుర
ఘునాథ నరవరుండు । నాడియగుపుత్రులనుగాంచి ఖ్యాతిమించె॥ ఉ॥ ఆచి
నతిమ్మభూవిభున కగ్రజు కాశ్రిత కల్పశాఖమే । ధా చతురాననుండుజగ
తాటిమహాబిరుదాంకు డాడితే । యాచలధీరుడూర్జిత దయానిధివేంక
ట రాజునిత్యధ। ర్మాచరుడుస్ప్రవీణుడుజయాదికుడై విలసిల్లు నెంతయున్॥
గీ॥ సరసుడా వేంకటేంద్రుడు సాళ్వవంశ । తిలకమగుగానపుత్రికలలఘు సు
తుల । లోనగుణవతియనగ జెన్నైనపెద్ద । కృష్ణమాదేవిమణిని బరిగ్ర
హించె॥ వ॥ ఆసాధ్వీరత్నంబైన పెదకృష్ణమా దేవియందు॥ గీ॥ ఆదిఘను
డైనపెద్దతిమ్మన్న కృష్ణ । పార్థివుండలధీరుండు బసవరాజు । నిత్యవిభవుండు
వీరన్న నీలకంఠ।ధన్యుడనమించునందనోత్తములగాంచె॥ క॥ శ్రీవెలయుగజిన
కృష్ణమ । దేవిరత్నంబునందు స్థిరభాగ్యనిధిన్ । భావజనిభు విరుపాక్షధ।
రావరునిం గాంచి జగతి ప్రస్తుతి కెక్కెన్॥ వ॥ మఱియు నక్కమాంబల

క్రమం బభివర్ణించెద॥ పంచపాది॥ మ॥ పటుసుజ్ఞాన కళాసిరూఢి మెఱయన్బ్రహ్మనులైనన్నయా । రుటగాడిభువియం దగున్వి మతగర్వోద్వృపత్స్రోధిని । స్ఫుట నర్మోక్తి వజాతశత్రు కరణింబాల్పొందు కొండ్రాజువెం । కటగాంభీర్యకళావిశేషము దగన్నప్పట్టు నాపాగ్రణీ । జటులస్ఫూర్తి వెలుంగుకృష్ణనృపరాట్స్వామిస్థరంగంటిరే॥ క॥ రాజకళావైఖరసుర । రాజితభోగమునగు ధరరాజధరిత్రిన్ । రాజువదాన్యత వేంకట । రాజన్యసుతుండునుల్ల రాజేంద్రుడిలన్॥ క॥ అసదృశవితరణవిద్యా । రసికునకును శౌర్యధైర్య రాజేశునకు । న్వసుమతి వేంకటభూ రు । బసవన్నపాలునకునన్వపార్థివులైనయే॥ క॥ ధీరుడు బాంధవసుజనా । ధారుడుశూరుడు నితాంత దానవిజితమం । దారుడు వేంకటశౌరికి । మారుడు వీరన్నరాజ మాత్రుడు ధరిణిన్॥ ఉత్సాహ॥ నీలకంధిసుంజయించి నీరజారిగేరియా । పాలకడలిమించి హంస పంక్తిదెగడి పూర్వది । క్ష్వాలకరినిధిక్కరించి ప్రబలె వేంకటేంద్రుమా। నీలకంఠరాజుకీర్తి నిఖిలదిక్తటంబులన్॥ క॥ శిక్షించుఖలుని కరుణన్। వీక్షించును సాధుజనుల వేంకటవసుధా । దక్షుని విరుపాక్షాధిపు । నిక్షుద్రయశోభిరాము నరవిమోగడన్॥ క॥ ఈరీతిపుత్రసంప । ద్భూరియశోరాజ్యవిజయ బోధకుడయియా । పౌరుషనిధి పెదతిమ్మ । క్ష్మారమణుని వేంకటాద్రి జనపతియలరున్॥ సీ॥ వసుమతిభాంధూర్వ హాణనిర్వవాలీల ఘుసికిట్టిప్రభుడు వేంకటవిభుండు । నిఖిలదిశాభోగ నిబిడకాశసూన ఘనసారవిభుడు వేంకటవిభుండు । సంతతనూనదానత్రాణ వేఖరి కర్ణాఖ్య విభుడు వేంకటవిభుండు । దృఢతరబాహా ప్రతిత్యర్థరీకృత గ్రహరాట్ప్రభుడు వేంకటవిభుండు । రాజుమాత్రుడెటిలప గొండ్రాజుతిమ్మ । ధరణినాయకుతనయుడు బాత్తనయుడు। ప్రౌఢవిద్వత్కవీశ్వర ప్రకరవినుత । గాఢసత్కృతివిభుడు వేంకటవిభుండు॥ వ॥ ఇట్టి లోకోత్తరున కభ్యుదయ పరంపరాభివృ

## కథానుక్రమణిక.

ద్ధిగా నాయొనర్పంబూనిన రెట్టమతశాస్త్రంబునకు వేంకటక్ష్మాపాల శిరోమణి నధినాథుంజేసి తద్వంశక్రమం బభివర్ణించి తదనంతరంబ యీ ప్రబంధంబునకు ననుక్రమణియం బెట్టిదనిన వర్ణాదిహేతువులగు భూజాత పుష్పపరీక్షయు, గోప్రజార్చనాశకునంబును, దూతలక్షణంబును, పక్షిశకునంబును, గర్భర్తులక్షణంబును, మేఘలక్షణంబును, విద్యుల్లక్షణంబును, గర్జిత లక్షణంబును, ఇంద్రచాపలక్షణంబును, పరివేషలక్షణంబును, ప్రతిసూర్యాతపహాయు లక్షణంబును, గ్రహయుద్ధలక్షణంబును, బీజావాపనంబును, అర్ఘ్యలక్షణంబును, గ్రహలక్షణంబును, ఆకస్మికలక్షణంబును, గ్రహచారా సమయోదయ లక్షణంబును, గ్రహబలఫల లక్షణంబులును,

గురూదశాబ్ద సంవత్సరఫల లక్షణంబులును, సంవత్సరాది ఫలంబులును, వివరించియుండునందు॥ సీ॥ వరుసగర్గాచార్య వర్యునిమతమున మతిశాలి హారిబట్ట మతమునందు। ధంకీర్తిఘనుడైన ధన్వునిమతమున బతిభజెన్నొంద౯ శ్రీపతిమతమున। మేటియైవరాహ మిహిరార్యుమతమున నన్నేఘమాలికా శాస్త్రమునను। నుతికీర్త్యాఖ్యచే నొసరునారాయణ భట్టమతంబున బ్రాజ్ఞులయిన। జరులయుక్తినిజ్యోతిష సారమునను। శకునచయమున గల యర్థచయము తెలిసి। కృతిగొనర్చినరెట్టని మతము నేను। వెడలెదెనుగించె దనుమీరు వేంకటేంద్ర॥ గీ॥ ఎంతలోకోపకారకమంపనిక్క। మెంతప్రత్యక్షమిదియని నొప్పుడార్య। లెల్లశిరసావహింపు మరీమతంబు। ఘనతరాదార్యశీల వేంకటనృపా॥

## వృక్షపుష్పఫల లక్షణము.

సీ॥ పరగనశోకంబు బ్రహ్మామేడియుబూచి కాచిన సస్యసంఘము ఫలించు। గపురంపుటనములు గాయరల్లగిసెపై రాదిగా గృష్ణధాన్యము లుప్రబలు। బాగుమీఱగజింత పాలయుగరివేము గాచిన వ్రీహివర్గంబు మించు। వింతగాదెమికిచే వెంతయుగాచిన యావరాశిసమృద్ధి యగును మిగుల। నేలమినుములుమోదుగులుగాయనలగుకొట్టి। మొల్లబూచిన యావాలు మొల్లమగును। నావిగాచినజనుమాను ప్రత్తివాడము। సత్యమింతయు వేంకట హ్మాతలేంద్ర॥ సీ॥ వావిలిపూచిన వర్ధిల్లుముత్యము త్రిలకంబుగాచిన గలుగువెండి। బిక్కమారేడును బెంపొందగాచిన నందంద బంగార మతిశయిల్లు। నత్తిగాచినదాక్ష మగ్గునసైయుండు గొలిమిగాచిన వజ్రకులము మెరయు। బంధూకములుబూయు బ్రబలునుబవడము ల్పచ్చల గాచిన భయములమరు। అనటిగాచినగోటియలు హర్షమందె। ధరణిబలు రక్కసులుబూయ గరులుజెలగు। బాదిరులుబూయ నావ్రులుమోదమందు। ప్రదనజయసాన్ద్రి వేంకటరాజచంద్ర॥ గీ॥ అడవితంగెడు రేయుల ననుముకుసుమ। పూచెనేనియుముదమగు భూమిప్రజకు। వలినబూచినద్విజులకు త్వలినిపూయ। క్షత్రియులకంద్రుజయము వేంకటనరేంద్ర॥ గీ॥ జమ్మిచంద్రలుగాచిన జాలపంట। గలుగువేములుతెన్నగా గాచెనేని। రోగములు లేవుప్రజలకు భోగమమరు। మిహిరసంకాశ వేంకట మేదినీశ॥ సీ॥ గనుగొనుమోదుగు కాయలోగింజలు గట్టిగామూడుజూ పట్టెనేని। గ్రమముననాద్రాది కార్తెలుపదునాల్గు నన్నియువర్షించు నదియెగాక। మొదటిగింజయయున్న మొదటికార్తులయందు నడిమిగింజయయున్న ననువుమీఱ। నడిమి కార్తులయందు గనగింజయుండిన గడకార్తులందును గలుగువాన। లందునే గింజగొఱుకొంచెమయ్యె నేని। తబకయయుయుండెనేని తత్కార్తులందు। నల్ప

వర్షంబుగురియు సాంద్రార్ద్రజనులు । కాంతినిర్జితచంద్ర వేంకటనరేంద్ర॥
సీ॥ మఱ్ఱియొద్దియునిస్స మారేడు నేరేడు మెంతిగోధుమలును వినుమయు
వలు । కలిగియునడవిలో గలచెట్లుగాచిన రెట్టడల్పమనెను బృధివిబంట।
కొడినెగాతినరుజ బొడముభూజనులకు కడిమి కాచినవాన కడమయగును।
జడిసిగాచినభీతి సిద్ధస్సునాగకేసరులు గాచినవాంతి సంభవించు । బిల్లుగా
యనగ్ని భీతిసంధిలును వెలగగాచినగాలి గలిగియుండు । బుడమలుగా
చిన భూమిపాలకులకు దశవాయులకును ప్రధానులకును । దశమఃలకు
జాలనన్యోన్య కలహమొదవు । నేచిలొద్దుగదిరిపెన పూచెనేని । పంట
లల్పంబులనియెను ప్రాజ్ఞడగుచు । నేర్పుమీఱగ రెట్ట కందర్పుడిలను॥

గోశకున లక్షణము.

సీ॥ భక్తితోనాషాఢబహుళనవమీలను మొదలింటిజామునమొదవు
గముల । నర్పించిరెండవయామంబుననరుండుతనకోర్కెఫలియించుననగనపు
డె। పాడియావైననుబలుమూపురముగల్గు వృషభమైననుమందవెడలెనేని।
వానలుగురియునవ్వారిగా గడులెస్సబండు సస్యంబులుబహువిధములు। మేదినీ
స్థలిసర్వసమృద్ధిగలుగు। నిఖిలజనులకునారోగ్యమతిశయిల్లు । వాంఛితార్థం
బులీడేరు వరుసమఱియు। కృపులకామానమనె వాల రెట్టిడిలను॥ పంచపాది॥
ఉ॥ ఆలలమిన్నరుండుతగ చర్చనచేసిన వేళనెఱ్ఱనై । చాలగగుంటిగుడ్డియును
జాబిరజొందినబక్క యాద్మఖే। దాలసవృత్తినెద్దయిననావయినన్గమిబాసివచ్చి
నఁ।గూలుదెవుళ్ళచేత బ్రజకుంభినివానలు లేవుతన్మహీ । పాలుడుహానిజెందు
ననెబాగుగ రెట్టడుమేదినిస్థలిన్॥ గీ॥ వేడ్కనావులనర్చించు వేళనలుపు। నె
ఱుపుగలగొడ్డుటావుదానెసగమంద। వెడలెనేనియుకొద్దిగావృష్టిగురియు । ర
చితసత్కృతవేంకట రాజచంద్ర॥

పక్షిశకున లక్షణము.

క॥ వినుపైడికంటిశకునము । గనునెడగంధాక్షతములఖగముం
మ్రొక్కిన్ । జనులర్పింపగవలయును । చనరోజ్జ్వలతిమ్మరాజవేంకటనృ
పతీ॥ఉ॥ పూవులునక్షతంబులును బొంసుగదోయిట దార్చివానకై । భావ
ములోనమానవుడుప్రశ్నయొనర్పగ బక్షియయ్యెడ । న్వావిరిజేసిగా బలుకవా
రితసృష్టియుగల్గునంద్రుగో। త్రావలయంబునందుగవిరాజినుతింపగ వేంకటా
ధిపా॥ చ॥ ఇరువుడబైడికంటివసియించిన పచ్చని ప్రమానికిందశ । ర్కరయు
నుబిట్టమాంసము ప్రకాశముగానిడిసంభ్రమసన్నమై । యరుదు ఘటిల్లపాపటిగ
మందులనొక్కటియయినముట్టినన్ । గురియునువర్షముల్మిగులగొబ్బున వేం
కటరాజశేఖరా॥చ॥ ఘనముగవానకై పయిడికంటికినర్చనసేయబోవుచో ।
ననలకృతాంతయక్షమరు దాశలనావిహగంబువచ్చితీ। గర్చినమఱిచేరినంబరగ

శీఘ్రమెవర్షము వచ్చుమచ్చుగా । గనకమహీంద్రధైర్యబుధకల్పక తిమ్మ
య వేంకటాధిపా॥ చ॥ చెలువుగ బక్షికర్చనను సేయక దత్కుజశాఖనుండియ
ప్పలు కొలంకకు చేనది పొంతతటాకము దండ బావి కే । వఁవసియించియా కె
లతివై ఖరిమీఱగ దీర్చు తా జనక । బలిమిగ వాలగల్గుగుణబంధుర వేంకటరాజశే
ఖరా॥ సీ॥ మనుజుండు పక్షికర్చన చేసియున్న చో నొప్పు గానది పేర్చి యొప్ప నే
ని కుడిశాఖ డిగి వచ్చి కూర్చున్న యామాలి వలపలి దిక్కునను నిలిచెనేని । మూ
త్రంబు విడిచిన ముదముతో శాంతపుదిక్కునను న్న యాదిశను విడిచి । యః త్యది
క్కునకేగి యటులుంచి యాడిన క్షితిజంబులకు బ్రదక్షిణము గాగ । వచ్చె
నేని యువర్షం బవశ్యముగను! వచ్చు మఱియును దలంచి వాంఛితంబు । లెల్ల
చేకూరునిది తథ్యమెంచి జూడ। కలితకీర్తి ప్రకాశ వేంకటమహీశ॥ గీ॥ ప్రశ్నమొ
నరించుచోట నుపయిడిశంఖ। కంటిపై జాతిపై నీరు రెంట నిడిన । వానియందం
బులో దిగిచేసియయిన చాల। వానిగలదని రెట్టడు బూనిపలికె॥ చ॥ పనివడి వాన
కై నరుడు ప్రశ్న రెయొనర్పగ బక్షి యున్న నో। చను నొయ్యటంచు నున్న తరుశాఖను
నుండిన వామభాగము । దెనయుగ జేష జేసిన మహీజము దాపటి కేగినం గనుం।
గొనను రిగుడ్లనైన మరి కుంభిని రెట్టడు వాన లేదనె॥ మ॥ స్థిరసౌభాగ్యనిదా
నగా సజిలిరాధేయాంబర స్పర్థితే । చరగీర్వాణమణీ ఘృణాఘనఘనత్ప్రత్రక్రి
యాదక్ష । క్షరిపుర్దీక్షితకీర్తిహార మహిమాత్మీస్థైక సంపన్నవి । స్ఫురద్దై
ర్యాధికళాదురంధర ధరాపుత్రీకసేనాక్రియా॥ మాలిని॥ మృగపతినిభశౌర్యా
మేదినీచక్రధుర్యా । నగధరనుతిశీలానందితార్థిసుఖేలా । దిగధిప సదృశౌ
జాధీరతా హాన్య రాజా। సుగుణగణకలాపా సూర్యవంశ ప్రదీపా॥ గద్య॥ ఇది
శ్రీమదొంటిమిట్ట రఘువీరకృపాలబ్ధసారసారత్వధుర్యాయలు రాజవంశసం
భవాయ్యలాఖ్యకవిద్వయప్రణీతంబగు రెట్టమతశాస్త్రంబునందు ప్రథమా
శ్వాసము సంపూర్ణము.

శ్రీరస్తు.

# రెట్టమతశాస్త్రము.

## ద్వితీయాశ్వాసము.

---

శ్రీమదహోబిలనృహరి। స్వామిదయాలబ్ధనిత్య సామ్రాజ్యరమా।
ధామనిరంతరజయవి। ఖ్యాతమలకొండ్రాజ వేంకటాద్రి నరేంద్రా॥

### ప్రజాప్రశ్న లక్షణము.

క॥ ఫలులయిన ఫలము లయినను । బరువడినక్షతలనయిన లట్టుకన
గుచుక్ । సరసులు వానకునడిగిన । విరివిగ వర్షంబుగురియు వేంకటనృపతీ॥

క॥ చరణద్వయంబుగరిమున । ధరియించుచునైనజలము దాటుచునయినన్।
సరసులు వానకునడిగిన। విరివిగవర్షంబుగురియు వేంకటనృపతీ॥ క॥ ధరగా
డుగుబట్టియయినను । సురచిరమగుగోడుగునీడజూచుచునయినన్ । సరసు
లువానకునడిగిన । విరివిగవర్షంబుగురియు వేంకటనృపతీ॥ గీ॥ ముసుకుబెట్టు
కయుంచుకమునుగుదెఱచి । గడపదాటుచుగంకంబుగడుగునపుడు । వచ్చు
నేవానయనినను వసుధవృష్టి । గలుగుననియొక్కమతము వేంకటనరేంద్ర ॥
చ॥ జనులముదంబుసంఘటిలశాస్త్రవిధిజ్ఞుని వానవచ్చునా। యనుసమయం
బునన్ ఘటమునందొకడక్కడనీళ్లుజల్లుచున్ । న్ననుదడికోకిబిందుతతీనయ్యె
డవర్షమువచ్చునంద్రునని। ద్వినయకలాపలిమ్మఘన వేంకటభూప నృపాలశేఖ
రా॥ సీ॥ చక్కెరయయినను మక్కవతోడుత బచ్చనియాకైనపప్పులయిన।
శ్రీగంధమునుసరసీరుహంబయినను గాయలైననుమాంస ఖండమయిన। గ
రమొప్పుఫలముల గరములజరియించి కడువాంఛవానకు నడిగెనేని । వర్షం
బుగురియునవశ్యంబు మఱియునునలునొద్దనీలతక్షణములతోడ । నూరికినిబో
యియున్నట్టివారుమగుడి। వత్తురేయనియడిగినవారు వేగ । వత్తురనిపల్కు
దురుశాస్త్రవాదులెల్ల। విమలగుణసాంద్రకొండ్రాజు వేంకటేంద్ర॥ చ॥ అన
లనమీర రాతిచరయామ్యదిశావలులంచునుండి యా।ననుమటు తెల్లజేసుకమ
నంబునభేదముపుట్టిగాబటం। బును వెనుజాఱమైచలత బొందగవానలువచ్చు
నేయనన్ । దనివిగవర్షముల్గురియు ధారుణి వేంకటరాజశేఖరా॥ క॥ మదు
వ్రనసీటంజెఱువున। గడువేడుకనిలిచినానుగలదేయనిన । న్జడిబట్టిగురియువర్ష
ము । విడున వేంకటనృపాల వినుతవిఫాల॥ గీ॥ కాల్వద్రున దాకిగొంచము
గాజలంబు । గలుగునెడనిల్చివర్షంబుగలదెయనిన । వసుధమీదనుదగుపాటి
వానవచ్చు। విక్రమోపేంద్రకొండ్రాజు వేంకటేంద్ర॥ సీ॥ చెలమచేరువకొద్ది
జలమున్నతావున పాడిగానీళ్ళున్నవోడకలను। బచ్చనిమ్రాకులపజ్జలబొగ్గల
చెట్లచెంగటవాగుచెంతనిలిచి । పెదవులుదడువుచుభీతిమైవడుకుచు ద్వార
కొనివానలుదొడ్డగాగ।గలదా లేదో యని కాంక్షతోనడిగిన గురియువర్షము
కడుకొంచెముగను। దప్పదీమాట మేదినీతలమునందు । ననుచు రెట్టడువివరిన్చె
నతులమతిని। సరససల్లాపభానువంశప్రదీప । విబుధజనగణ్య వేంకటవిభువరే
ణ్య॥ ము॥ అటద్దైవజ్ఞునిజేరివానగలదేయంచున్ జను ల్వేడు వే । ళలనొక్కన్దను
నొక్కచోటగరవాలంబూనిఝుల్పించుచు । న్నలినంబాడవుజేయుచున్నవ
గుచున్నం బాయసాన్నంబుగుం। డలలోనింపుచునుండినన్దలతు వేడ్కవృష్టి
భూపాలకా॥ చ॥ తెలివొనగూడవానగలదేయనువేళలగొండఱచ్చటన్ । స
లిలముపుక్కిళించుతృషనన్జల మానిననీరుద్రొక్కనం । బొలుపుగబంకమట్టి
ననుమాత్రముచేయుచు నున్నవర్షముల్ । గలవునమృద్ధిగానుకవికల్పకవేం

కటరాజశేఖరా॥ చ॥ కలుగునే వానయంచునడుగఁ జనువేళ గజంబుకుక్షి
లో। సలిలముఁబీల్చితుండమున సారెకు మేదికిఁజల్లుచున్నఁగ । ప్పలుగుమిగూ
సినేని ప్రతిభాస్కరుఁడప్పుడె కశ్చిమంబునఁ। బొలిచినవర్షముల్ గురియునో
రసవేంకట రాజశేఖరా॥ చ॥ వలయునునిప్పులున్నముక వాఁడినతీఁగయుశీ
తలోల్క్వకం । బులుమఱియుప్పుకప్పురము బొగ్గులునాదిగ నెన్మిదింటిలో ।
పలనొకకైనహస్తమున గట్టుకవానలువచ్చు నేయనఁ । గలుగుదువృష్టి
యప్పుడవె గట్టిగరెట్టడు దిట్టడె మహిఁ॥

గర్భర్తు లక్షణము.

సీ॥ ఎండలుప్రబలుట యిలవిలుటయుసూర్య పరివేషమునబండి పాలిన
ట్టు। గర్జిలుటయుమఱిఘనముగానుఱుముట మంచుగాలియునుమ్మగించుట
యును। సన్నపువానయుజలియునునివిపదివివరింపవర్ష ధాతువులుమఱియు । స
ధికాతపమువాయు వహిమాంశుపరిదియు మేఘవిర్గోషంబు మెఱయుట
యును। ననగనివిపంచ ధాతువులండ్రుకొంద। అట్టిధాతువు లెరిగినవధికముగను।
వృష్టిగురియునుబహుసస్యవితతు లెల్ల । జాలఫలియించు వేంకటక్ష్మాతలేంద్ర॥
సీ॥ దినరాజమూలర్క్షమునకుపచ్చినయాదిగనుస త్తమంబైనదినమునందు । నె
న్నంగదొంబదియేడవదినమునబరివేషమెసగినబరగబదియు । మూడవవాసరం
బుననూటముప్పదియేడవదినమున నింద్రధనువు । దనరిసరిపదు నెన్మిదవవాడు
నూటెన్మిదవదివసంబునదవరుతళ్లుకు । గనిననలుబదియేడవదినమువాన। నూట
నలుబదియేడవనాట మొగులు । జెలగెనేనియుగర్భంబునిలుచుటకును। లక్షణం
బది వేంకటేశాతలేంద్ర॥ క॥ తగుమూలతారయాదిగ । మృగశిరయుందనుక
గర్భబుతువులగుసుదా। మృగశీర్షమ మొదలుగధర । నొగివానలువచ్చు వేంక
టోర్వీరమణా॥ సీ॥ పరికింపప్రథమగర్భర్తులగ్నంబునగ్రూరగ్రహంబులుగూడి
యున్న । నుదయించుచుండిననొసరజూచుచునున్న గుజభానులిరువురుగూడి
యున్న । దొలగకసవిమెచంద్రునిగూడియున్ననా వేళనుత్పాతమనగబడుమి।
నాడెగర్భమునరెండవభాగమనదగ్రహంబులుండినగర్భమలదియుండు । క్షణ
వమీఁఅద్వితీయభాగముననున్న । నరయనీమూడుభాగంబులందునున్న। బో
వుదదర్భమీఁక్రమంబున నెమెల్ల । దారకుఁజూడుమనె రెట్టమధన్యుడిలను॥ క॥ తర
ణిధనుర్మకరంబుల । జరియించిననడగియుందుజలపముమెఱపుఁ । హరిచావ
ముఁఱుముగలిగిన। విరివిగగర్భర్తునలరు వేంకటనృపతీ॥ గీ॥ ఒనరుఘటమీనము
లకుశనియుండునపుడు। ధనదిశమారుతము మేఘములు మెఱపులు । గలుగునే
నియుగర్భర్తువలుయునంద్రు। వేంకటనృపాల సంతతవినయశీల॥ గీ॥ మేఘవృ
షభంబులనుబద్మమిత్రుఁడున్న । మెఱుపుపరివేషమును వానయుఱుమునింద్ర।
ధనువు మేఘంబుగలిగిసదగఫలించు। గర్భబుతువుర్విమీఁద వేంకటనృపాల॥ గీ॥
మిధునకర్కటములనుసమ్మిహిరుడున్న। వానగఁఱిసిన మఱిపునర్వసువునందు।

వర్షమెసగినబంటలుపఱలుమహిని। వేంకటనరేంద్రసత్కళావిజితచంద్ర॥ సీ॥ సిం
హకన్యలయందుశీతాంశుడున్నను వానలుగురియునువఱలుబంట । లరతులా
వృశ్చికములయందుసినుడున్న గొద్దిగవానలుగురియుచుండు । హీనంబులగు
బంటలెండుమిండపొలాలు తపసుండువృశ్చికధనువులందు । దనరంగనాదశధా
తుఘలుండిన గర్ణాటకముననగ్గలముపంట। సొందిదశ ధాతువులునిట్టుచూడగ
ర్భ । మమరిననుమూలతారకమూదిగాగ । నెఱసిమఱినూటతొంబదెనిమిది
దినముల। వృష్టిగురియునుగొండ్రాజువేంకటేంద్ర॥ గీ॥ తలచిచూడనట్టిదశ
ధాతువులును।గలిగినను గ్రహములు లేకయున్న । నాఱునెలలమీదనాఱునా
ళ్ళకువాన । గురియువేంకటాద్రినరవరేణ్య॥ క॥ ధరమార్గశీర్షమునం । దుష్ప
వానయుబౌషముననుహతాతపముల్ । వెరసినముందరవర్షము । గురియు
న్వేంకటనరేంద్ర గురునయసాంద్రా॥ సీ॥ అనమార్గశీర్షంబు నందాదిదిన
ముల వలవంక రేకలునింగయందు।నుండవావున్న నుఱుమును మేఘంబుమె
ఱపునుండినాడె మిహిరచంద్రుః। లఘుప్రకాశులై యలరిన గలుగుమీదట
వానసైన సమృద్ధిగాగ।నాకృష్ణపక్షమునందలిపాడ్యమి తెలిరేఖలునుమం
చిదీనినమరి । గురియుఃబంచమియాలోనగొప్పవాన । యయ్యమావాస్యసా
త్వికశాంకుడున్న। గలుగుముందట నాశ్లేషకార్తెయందు । వృష్టికొండ్రాజుతి
మ్మయవేంకటేంద్ర॥ క॥ భువిపౌషశుద్ధసప్తమి। బవనముమంచుఱుక బరుపబ
ర్విసవర్షం। బవిరళముగగురియుజుమీ । వివిధగతిం దిమ్మరాజవేంకటనృపతీ॥
గీ॥ బౌషమునరోహిణీజాలపరిధిగట్టి । ముందుగలిగినవాషాఢమాసమునను।
వృష్టిగురియునుధాత్రి సంతుష్టిగాగ । విభవదేవేంద్రకొండ్రాజు వేంకటేంద్ర॥
చ॥ పొలుపుగపౌష మాసమునబున్నమయాదిగ సప్తవాసరం । బులనలధా
తుపుర్వరిణముజ్వలలీలదనర్చు నేని భూ । వలయములోనమీదట నవశ్యము
వానలుగల్గియుండుబై । రులు ఫలియించుపొందగు సమృద్ధియుగల్గును వేంక
టాధిపా॥ గీ॥ పౌషమాసశుద్ధపౌర్ణమినాడుతే । సంజకడముమంచుసంఘటి
లిన । బంటగలుగుజాలపరగగర్ణాటభూ । బలిమి తిమ్మరాజువేంకటేంద్ర॥ గీ॥
పౌషబహుళాష్టమినిస్వాతిబరగువేళ । గర్జితము మించు మంచునుగలిగె నేని।
జెలగుమలనాటబంటలుగలుగుగాని । ఎనుముకొండ్రాజుతిమ్మయవేంకటేం
ద్ర॥ సీ॥ అలజ్యేష్టమాసంబు నందాదిదివసంబు మొదలుగాబదిదినంబులకు వా
న। గురిసిన కార్తెలగురియసినవర్షంబులొండెడుగురియకయుండెనేని। శ్యామ
వర్ణము నెఱ్ఱచాయయుమఱియును వరుస బాండవగౌరవర్ణముగను । గనుపట్టి
మేఘసంఘంబులునడిచిన జగతీసురుల్నృపుల్వాల నొచ్చి। శూద్రవృత్తిజరిం
తురుత్క్షోణిప్రజలు । సంతతంబునుమిగులగేశములచేత। భువినిబీడింపబడుదురు
పొసగజాలు।ననియెఱిగ్గుమపసలవిఖ్యాతలేంద్ర॥

## మేఘ లక్షణము.

వ. మఱియు మేఘవర్ణంబయిన మేఘమండలంబు మధువర్ణంబై సకల హాంబులచేతనొత్తురు, నది నెత్తురుమండలంబనంబరగు, నట్టిమధువర్ణ మేఘంబు పంచదశయోజన విస్తీర్ణంబై యుండు నందు ద్రోణపరిమితవర్షంబుగలుగు కపిలంబగు మేఘవర్షంబు మరున్మండలంబనంబడు, నదిద్వాదశయోజనవిశాలంబయియుండు, నందును వాయువు ప్రధానంబయిన వర్షంబు సంభవించుననిగొందఱుబల్కుదురు. గర్భసమయంబున మేఘంబుమధువర్ణంబై యుండెనేనియన గ్రహాకృత్యంబు గలిగియుండెనేని ఖండవర్షంబగు గ్రహావక్రత్వంబులేనియెడ నామేఘంబు ద్రోణసుఖంబువర్షించు ద్రోణసంఖ్యయెట్టిదన బదిమాఱుమానికెయొక్క తూమును నానాల్గుద్రోణ బనంబడు, గ్రహాబలంబుగలిగెనేని వర్షంబుగురియు, రాజులేనిరాష్ట్రంబునంబోలె గ్రహాబలంబులేకున్నయెడల వర్షంబు గలుగనేరదు. మరియు మేఘ లక్షణం బెట్టిదనిన.

క॥ జలదము లేనుగవలెమఱి । నలుదిక్కులయందుమిగుల నల్లగనున్నన్ । బొలుపుగ వానలుగురియును । విలసత్ప్రతిభాకలాప వేంకటభూపా॥ క॥ మందగతి మొగులుమృగముల । యందంబున గురులరీతి నలమొయిలుండన్ । గ్రందుకొని మెలగువర్షం । బందముగావచ్చు వేంకటాధిపవర్యా॥ క॥ తళుకుతళుక్కనమెరయగ । నలగగనముగప్పు తెల్లనగు మేఘమిలా । స్థలిగలిగయువర్షించును । హరిబలకొండ్రాజ వేంకటాధిపతిలకా॥ చ॥ అమరగనిట్టినీలవిశదాంబుధరంబులలోమెఱుంగుతా । ప్రమువలవాననమ్మి విరిమాడ్కిరహించినయేని రాజమే.ఘములలోసంజ్ఞనొందియవిగంగయువింధ్యయుమేరుభూమివ । ర్షము గురియున్ ధరాస్థలి నిజంబిదితిమ్మయ వేంకటాధిపా॥ గీ॥ అగ్నివన్నెల మేఘంబు నందుగొప్ప మెఱుపుమెఱసిన మొగులుసమృద్ధిగాగ । వింధ్యమునసుండిగొత మి వెడలగలుగు। వృష్టికొండ్రాజుతిమ్మయ వేంకటేంద్ర॥ చ॥ నలినమురీతినుండె దుఘనంబుగణింపగ విప్రజాతియుం । వలరగనెఱ్ఱనైన మొగులారయుక్షత్రియ జాతియంతయు । న్నలువగునట్టివారిదమునాలవజాతి యటంద్రుకోవిధుల్ ।బలరిపుభోగసంతతకృపానిధితిమ్మయ వేంకటాధిపా॥ గీ॥ వసుధవర్షించుపుష్కళావర్తకంబు । లనెడుజలదంబులద్భుతం బావహిల్ల।ఖండవర్షంబులితర మేఘములుగురియు । ధీరజనగణ్య వేంకటాధిపవరేణ్య॥ వ॥ మఱియు చామరంబుల చందంబున కొలంకుల యందంబున చిలువంబున మంచాంబులచందంబునకుంభికుంభంబు బాగుగ మొసళ్ళబోరను వెండికొండలరీతినిసింహాంబులభాతినిగోపురంబులగాపున చంద్రబింబంబులచొప్పునశృంగయెరవనంబులకరణీ దేవవిమానంబులసరణిగొడుగులపదువున కత్తులచాడ్పున రాక్షసులమాడ్కిని కుంజరంబులపోల్కిని వృషభంబుల విధంబునశంఖంబులసోయగంబున భాసిల్లు మేఘం

బువర్షించునదియునుంగాక॥ గీ॥ కాకినక్క కోతికాలినకొండకును। దేలుమోటు మాకుశూలమెలుగు। విడిచిపోయిననిండ్ల విడుపునమొగులున్న। వృష్టికొంచమనియెరెట్టడిలను॥ గీ॥ క్రొత్తగోరోజనంబింద్రగోపవురువు। కటికినెత్తురుయింగిలీకములవన్నె। నలరుమొగులున్నవానలేదనియురెట్ట। డఖలశాస్త్రవిదులెల్ల నభినుతింప॥ సీ॥ అరుణమేఘంబునవల్పమైయున్నట్టితుంపరవానయేపెంపులేదు। మెరుపుగాన్పింపంగి మేఘముల్గొండలమీద రేపునుమాపుమేయుచున్న। వర్షముల్గురియునువరుసతో వాయువ్యదిశయందు నీశాన్యదిక్కునందు। మేఘంబులున్నగ మెఱుపుతో నుండినగలుగును వృష్టియుగ్గలముగాగ। నెంచిచూడంగ ధాత్రిలోనిదివరాహ। మిహరమతమంద్రుకోవిదుల్మిహిరతేజ। దీరకొండల తిమ్మపార్థివకుమార। జన్యజయసాంద్రవేంకటక్ష్మాతలేంద్ర॥ గీ॥ భానుడుండంగ తూర్పున పశ్చిమమున। మెరసిననుపై డివన్నెగ మేఘమున్న। వానగురియునుధరణినవ్వారిగాగ। తిమ్మభూపాలవేంకటాద్రిక్షితీన్ద్ర॥ క॥ పెనుమట్టిమానురీతిని। గనుపట్టిన మొగులుమీద వాంచసవర్ణం। బొనరిన మేఘముదోచిన। వినువానయువచ్చుమిగుల వేంకటనృపతీ॥ వ॥ పూర్వాషాఢగ౧౬ద్రోణంబులుగురిసిన పంటలుగలుగు, అందు కడమమైనకడమయై యుండు.ఉత్తరాషాఢగ౨౧ద్రోణంబులుగురిసిన వరిపంటలుగలుగు. వెలిపైరులల్పంబులగు, చోరబాధలుగలుగు. శ్రవణనక్షత్రంబునమొదటనే ౧౮ద్రోణంబులుగురిసిన బ్రాహ్మణహానియగు. రాజన్యులకక్కడక్కడ నన్యోన్యకలహంబులు ఘటిల్లు, ౧౬ ద్రోణంబులు గురిసిన తటాకంబులకు భయంబు వాటిల్లు, శతతార ౧౮ద్రోణంబులు గురిసిన యావులకడుపులు మేలుగాబాలుపితురు, పునర్వసువున ౨౦ ద్రోణంబులు గురిసిన భూమికి సస్యంబులుచెలంగు, రోగంబులును గలహంబులును గలిగియుండు, పుష్యంబున ౧౭ ద్రోణంబులుగురిసిన భూనాథులకు వ్యాధులు సంభవించు, వసుధాలయంబు దుర్భిక్షరహితంబై యొప్పు, ఆశ్లేష ౧౬ద్రోణంబులుగురిసిన వ్యాకులత్వంబుఁబొందక ప్రజలుసంతసంబున బ్రవర్తిల్లుదురు, బలరిపుల్ప్రమోదంబునవర్ధిల్లుదురు, మఖ ౨౦ ద్రోణంబులుగురిసిన ప్రజలు భయరహితులై దేవపితృపూజాతత్పరులై చెలంగుదురు. పుబ్బ ౨౩ ద్రోణంబులుగురిసి జనులుసద్వినయసంపన్నులై జెలంగుదురు, ఉత్త౨౭ద్రోణంబులుగురిసిన భూభుజులును ప్రజలునుసుఖవసతిజీవింతురు, హస్త౧౬ద్రోణంబులుగురిసిన భూసురులురాజవరులుధర్మప్రవర్తులయి దేజరిల్లుచు రుచినధికంబుగా మారుతంబువీచినభయంబులుద్భవిల్లు, స్వాతి౧౦ద్రోణంబులుగురిసినభూప్రజలు సుకస్థితినుండుదురు, విశాఖ ౧౦ద్రోణంబులుగురిసిన భూసురులు రాజులు స్వధర్మప్రవర్తకులగుదురు, అనూరాధ౧౮ద్రోణంబులుగురిసిన రాజులచేరాజ్యంబు పాలింపబడు

యొప్పు, జ్యేష్ఠంబ ద్రోణంబులుగురిసిన చోరభయంబుగలిగి పంటలపరిమితం బయియుండు మరణంబు లగ్గలంబగు మూలంబ ద్రోణంబులుగురిసిన రాజులు దుర్జనులై తిరుగుదురు ప్రజలకాపదలొదవునని రెట్టండు నిశ్చయించె.

విద్యుల్లక్షణము.

సీ॥ పంచరత్నంబులమించుజూపట్లు నజనసంతతికి సంతసంబుగలుగు। యేనువన్నెలునుప్రత్యేకమై వెలసిన వాయువువిసరును వానయెసగ। యెఱ్ఱవిమెరుపయ్యె నేనివర్షమువచ్చు కలహంబుమిట్టు భూతలమునందు। అలనెఱ్ఱమెఱపులో నపగంజిచాయలు గనుపించవానలు గలుగుదలవ। దరిసనప్రామాట్కి ములుకపువ్వుమురీతి పున్నమబొడుము చందురునిలీల। మెరసెనేని యువానలు మిగులప్రబలు। భూజనంబుల పరితుష్టి బొందుసకల। గుణవిచక్షణరొప్పసద్గుణులకవని। విజివచకోరచంద్ర వేంకటనరేంద్రా॥ గీ॥ పొంగు తెంగునభసితంబు పోల్కిమెరపు।గానుపించినతడవుకు గలుగువాన। మిన్నునలమించినొత్తురువన్నెయయిన। కలహమాననెరెట్టనకవివరుండు॥ క॥ జ్వలనయమనిలిరుమదుదా। కలమెరసినవానలేదు పరవినిపరది। కుక్కలమెరుగు వానగురియును। విలసితమతితిమ్మరాజ వేంకటనృపతీ॥ గీ॥ కపిలవర్ణంబుమెరుపును గాలివిసరు। నెక్కుడగుదెర్ర నొగపున నెండగాయు। తెలిమెరుంగు ననొరపౌను గలదువాన। వినుపసపుఛాయ మెరపున వేంకటేంద్ర॥

గర్జితలక్షణము.

ఉ॥ పారెదుబండ్లిమ్రోతగతి పందులుచెల్వుగరొప్పరీతివే। సారకగార్ధభంబరచుజాడనుగంటలనాదుకైవడిన్। వారకతోముకుండలరవంబుగతింస్తవితంబుపర్వినన్।ధారుణివానలేదనియె ధన్యుడు రెట్టడు ప్రాజ్ఞులెన్నగన్॥

ఇంద్రధనుర్లక్షణము.

సీ॥ వానకాలము సభాస్వంతుండుగ్రుంగిన వెన్నచీకటిపర్వు వేళయందు। వాయుదిక్కుననగ్నివర్షంబుతోనగబేధి చాపముగానుపించెనేని। యావర్ణముల నేసుధాంశుమండలమున్న మహామండలంబున మానవులును। క్షితినాథులునుకారుచిచ్చు వేగూలుదురద్భుతంబడరనాహారిథనుస్సు।పచ్చనయియున్నప్రజలకు బాధపుట్టు। తెల్లనయియున్నజెడుసర్వదేశములును।పూనియీకడుదాకకిమాన వెపుడు। నని యెరెట్టడుసకలవిద్యావిదుండు॥ గీ॥ పసుపుపచ్చయూకుపచ్చనల్పును దెల్పు। మెరుపుసన్నియలమహేంద్రచాప। ముండ మెుగులునటునున్న పంటలుగల్గు।వినుముతిమ్మరాజవేంకటేంద్ర॥క॥ హరిహయచాపమునిశియం।దరుదుగ నేదిక్కుదోచెనాదిక్కు ప్రజల్। వెరపుచెడిపోదురనియునుగురుతుగ రెట్టడుసమస్తకోవిదులెంచన్॥ క॥ చోరకొనిరాతిరివరుసము।గురియగపురుహోత్రధనువు కువలయబంధు। న్దరుణమగుమెరుపుద్యోచిన।ధరణి

ళులునొత్తుకనియెః తగ రెట్టడిలక॥ గీ॥ పగులువర్షింప మెరుపుజూపట్టియిం
ద్ర । ధనువు పశ్చిమమునసుండి దక్షిణాశ। ధనకదూర్పుననుండి యు త్తరపు
దిశకు । గదసిననుమేను ప్రజలకు వేంకటనరేంద్ర॥ పరివేష లక్షణము.
క॥ వా విరిజ్యేష్ఠాషాఢ । శ్రావణముల కొండువరుణుచక్కటిబొడమక। లేవ
నెవానలు రెట్టం।డీవసుధతిమూసమూర్యులెల్లరుపొగడక॥ ను॥ వెలయగసూ
ర్యచంద్రపరివేషములచ్చుపుపయిడిచాయల । బ్బలువగువానకాలమునబర్వి
తివర్షమువచ్చునింపుసాం। పనరగనన్యకాలముననైననుపుట్టునురాచకార్యము
లే।కలుషవిదూరతిమ్మమహీ కాంతుని వేంకటరాజ శేఖరుక॥క॥ఇనశశిపరివేషం
బులు। గవరహితములగుచువాన కాలములందుం।గనుపట్టిసకలలోచను।విను
వారలు లేవునిజము వేంకటనృపతీ॥ క॥ ప్రావృట్కాలములను మే । ఘావళితో
గూడశశికినహిమాంసునకుం।భావింపపరిధులుండిన । వేవేగమెవానగురియు
వేంకటనృపతీ॥ గీ॥ వానతరినిచంద్రవనజబాంధవులకు । రెండుమూడుపరిదు
లుండెనేని। వానగల్గులెస్స వానలేకుండిన। నృపులునొత్తురనియె రెట్టగనుడు॥
ఉ॥ ఎంతయువానకాలమున హేళికిజుక్క లకెల్ల రేనికిం। వింతగరెండుమూడు
పరివేషములెద్దెసగానుపించినం । రంతులుగాంతిరాదిశధరావరులాపరుదుల్క
తప్రభా। వంతములయ్యెనేనిమఱివర్షము లేద నెరెట్టడిమ్మహీశ॥ సీ॥ వివరింప
శశిపవేషంబులోబృహస్పతియున్నను గొరగాదుబ్రాహ్మణులకు । సనిమిష
కులశత్రువాచార్యుడుండినవర్షంబుగురియునవశ్యముగను । గువలయాప్తునిత
నూభవుడున్న హానియగానర్భశ్రేణికినద్భుతముగ । నంగారకుండున్న నందండ
నరుదుగాధరణినివినుజగడాలుపుట్టు । చంద్రకిరణునినందనుడుండెనేని। పట్టభ
ద్రులనొత్తురుగట్టిగాను।వసుధలోనిదిగాదనవలదుపెద్ద।। లనియెరెట్టడుసకలవి
ద్యావిదుండు॥ క॥ హరిణాంకునిపరివేషం।బరుణంబయియుండనందు నర్కజకు
జులుక। గురుడువసించినప్రజలకు । నరుదగునాపదలుగల్గదనరెట్టడిలక॥ గీ॥
చంద్రుడస్తమించుసమయంబునందున। య్యరుణపరిధిలోన గురుడుకుజుడు।
శనియునుండినసీసార్వభౌములనొత్తు।రనియెరెట్టకవియుహర్ష మొదవ॥ క॥ హి
మకరుడుగ్రుంకపరివేషములోకుజుడున్న గాదుజగతికిశుక్రుం । డమరగనుండిన
బోయలు।సమయుదురనెరెట్టడఖిల శాస్త్రజ్ఞుడిలక॥ ప్రతిసూర్యలక్షణము.

సీ॥ ఊహింపసూర్యుండు నుత్తరదిశయందు ప్రతిబింబించెనేని వర్షంబ
గలుగు । నొగియామ్యదిక్కునసుదయించిననుగాలి ప్రబలంబుగావీనుబశ్చి
మమున।బొడమెనేనియువాన జడిబట్టికురియును వర్షంబెనొండుదురఖిలజను
లు।ప్రాగ్భాగమునకుజూపట్టినబహువృష్టి యొసగియుండునుభీతి హెచ్చుప్రజ
జకు।పద్మసంభాషితంబునబలుగునట్టి । శాస్త్రమిాక్షించియిటుబల్కె సరసు
లెన్న।కవితవాక్ప్రౌఢిరెట్టనకవివరుండు । విపులకారుణ్య వేంకటనృపవరేణ్య॥

చ॥ జ్వలనకృతాంతరాక్షస దిశాస్థలులంపవనంబువీనకే। వలమునులేవు
వర్షములువారుణ దిక్కుననల్పవానయా నలయితరాశలంగలుగునత్యధికం
బుగవానసిశ్చయం। బలఘుజయార్యతిమ్మనసుధాధిపవేంకట రాజశేఖరా॥
తోటకం॥ చరణానతశాత్రవశౌర్యగుణా। భరణాపరిపాలితబాంధవభూ। భర
ణాహితరేణ్యకృపానిధిధీ। కరుణాజనసత్కవిరాజనుతా॥ శా॥ స్వర్గామ్రప్రభు
నాహదంతిహరిగీర్వాణద్రుశాఖా స్తదా। వార్ధిగ్రాహల భృత్తుషాంశిఖరవ్యా
జోపకుందావళిస్పర్ధాభుప్రథమానకీర్తిబహుమాపంచాదితాజాడవే। గీదా
శ్రీవనితాసమాశ్రితలసద్గేహస్వభాచర్గళా॥ ద్వితీయాశ్వాసము సంపూర్ణం.

# రెట్టమతశాస్త్రము.

## తృతీయాశ్వాసము.

శ్రీయుపతీవరహోబలనాయకపాదాబ్జసేవనస్థితకీర్తి।
శ్రీయుతసముదంచితపుణ్యాయుతకొండ్రాజు వేంకటాద్రినరేంద్రా॥

### బీజావాపన లక్షణము.

గీ॥ హస్తమృగశీర్షమఖలయందాధనిష్ఠ। రేవతీతారనుత్తరాత్రితయ మునను ధరణవిత్తినధాన్యముల్దగఫలించు। నిశ్చయంబిది వేంకటనృపవరేణ్య॥ గీ॥ యాషిపుష్యపునర్వసురోహిణులను। మహినివిత్తినవరియుచామయనునెద గు। నరయమూలర్క్షమునవిత్తినట్టిపయిరు। లన్నియుఫలించుననెరెట్టడధిక ముగను॥ సీ॥ అశ్వినిపుబ్బపూర్వాషాఢనార్ద్రపూర్వాభాద్రవిత్తిననలరుపత్తి। శతతారయందు విశాఖనువిత్తిన కందమూలేక్షువుల్లదుఫలించు। రహిమీర శ్రవణతారకయందుజల్లిన జెన్నంగివరిఫలసిద్ధిజెందు। దాంబూలవల్లియుత్తర యందువేసిన బ్రబలుచుండునపారవారముగను। కృత్తికనుహస్తతారను విత్తినట్టి సెనగవిలసిల్లుధరణినిజనులుదనియ। భరణివిత్తిన గోధుమల్ఫలితమ గును। తిమ్మభూపాలవేంకటాద్రిక్షితీంద్ర॥ గీ॥ సెనగపుబ్బనువిత్తినసమయు నన్ని। నార్ద్రవిత్తినదెవులుచె నణగిపోవు। చిత్తవిత్తినవేవేగజెరుచుమిడత। అనియెరెట్టడుసకలవిద్యావిదుండు॥ సీ॥ జగతినిగోధుమల్మృగశీర్షతారనువి త్తినమృగములుదృప్తిదినును। జ్యేష్ఠలోవిత్తసిద్ధించచాపంటయుపండిన చోరు లపాలబడును। ప్రత్తియాశ్లేషలోవిత్తినవొకపాటిఫలమింతెకానివెగ్గలముగలు గ। దటుగాననక్షత్రమరియకవిత్తినపండినట్లనెయుండిబెండువోవు। శతభిష క్తారయందువిశాఖయందు। లగిసెమునుగలువిత్తిన నెగడనీక। బుర్వుబట్టును మిగులనద్భుతముగాగ। ననియెరెట్టడుసకలవిద్యావిదుండు॥ క॥ క్రూరగ్రహం బులుండిన। తారలనుపరాగయుక్తతారలయందున్। గోరికవిత్తినధాన్యము। వారయనెవ్వియుఫలించదనరెట్టడిలన్॥ గీ॥ అరసిచూడంగపాపగ్రహంబులున్న

లగ్నమునవారువీక్షించులగ్నమునను । విత్తినను లెస్సగాదనెవివిధశాస్త్ర । ని
పుణుడైనట్టిరెట్టడునిశ్చయముగ॥గీ॥లగ్నముననైనశుక్రుడాలగ్నమునకు। సూ
టిగానస్తమంబగుచోటనైన। యున్నయెడవిత్తవచ్చును నుర్విలోన । నఖిల
ధాన్యంబులును వెంకటాద్రివర్య॥ క॥ ఎన్నగశశికేంద్రంబున । నున్ననుపాపగ్ర
హంబు లోగిమంచివిగా। కున్నను విత్తినధాన్యము। లన్నియు ఫలియించు
వేంకటాధిపతిలకా॥ సీ॥ ద్యుమణిచంద్రులుగూడియున్నలగ్నంబున నేమియు
విత్తరాదెంచిచూడ । క్షోణిపుత్రుడుగనుగొన్నలగ్నంబునవిత్తువేసినకారివేగ
పట్టు। లతరాహువీక్షించులగ్నంబునందున వేసినచీడయగావేగమునను। సైర
వహితుడులగ్నంబుననుండగ వేసినయనటులు వెలయజార। నొనరగనాచంద్ర
లగ్నంబు నుష్ణకరుడు । చూడవేసినప్రబలమగాచుండుబుధుడు । లగ్నమునను
న్నధరవిత్తినవియునెల్ల । ఫలముజెన్నొంద వెంకటక్షభువనతంస॥ క॥ దిననా
యకుడార్ద్రికు వచ్చినదినమును మొదలుగాక్షితితలమునవి। త్తినవన్నియు ఫ
లియించును । వినుమధితతియగాటజేసి వేంకటనృపతీ॥ గీ॥ శ్రవణతారనుజల్లిన
రాజనంబు। స్వల్పఫలమగునార్ద్రిపుష్యములభరణి । యలపునర్వసురోహిణు
లందుమఖను। విత్తియుఫలించునెంతయు వేంకటేంద్రా॥ గీ॥ స్వాతిపూర్వత్ర
యంబున శశివసింప। బ్రత్తివిత్తినఫలియించు బహుళముగను । జ్యేష్ఠవిత్తి
ననుములు చెలగుపంట । నిజయనిస్తంద్రకొండ్రాజువేంకటేంద్ర। గీ॥ హస్త
నక్షత్రమున పెసలార్ద్రినువ్వు । లమర నరమూల తారకయందు కంది ।
తిరయనూరాధనూలువిత్తినఫలించు । వినుము వేంకటనృపవర్యవినుతశౌర్య॥
క॥అలయశ్వినందుసెనగలు।నలపూర్వాషాఢలోననలసందలుదా। దలవానగూ
డగవిత్తిన।ఫలియించును వేంకటాద్రిపార్థివతిలకా॥ క॥కోదినయుత్తరయందున।
నూరాధనుమూలరోహిణుల రేవతిలో। పైరులుబెట్టుటయుత్తమ। మారసిచూ
డంగవేంకటాద్రినృపాలా॥క॥మఱియుత్తరయునురోహిణి। వరుసననూరాధలం
త్యవరరుక్షమున।స్థిరజొన్నపైరుబెట్టుట । కరముత్తమనెనురెట్టకవివరుడధిపా॥
గీ॥అశ్వినిధనిష్ఠశతతారయాశ్రవణము। మఱిపునర్వసులెంచంగమధ్యమమును।
పృథ్విలోపలపైరులుబెట్టుటకును । నిజముకొండ్రాజు వేంకటనృపవరేణ్య॥ గీ॥
జ్యేష్ఠయువిశాఖకృత్తికచిత్తయార్ద్రి।భరణిపూర్వత్రయంబునబైరులిడుట।నరసి
చూడంగనిష్ఫలంబనగబరగు । వితతనయసాంద్రకొండ్రాజువేంకటేంద్ర॥గీ॥ మ
కరసింహావృషభమత్స్యమర్కటరాసు। లుత్తమంబుజొన్నకొగినిభామము । ను
న్నచంద్రసౌమ్యశుక్రులున్నుమంచి। విత్తసమునకుర్వి వేంకటేంద్రా॥ వ॥ అది
యునుంగాకఛాయాపుత్రుండగుశనిమేషంబున వర్తింప వృషభంబున గురుడు
న్నయవసరంబునధనుర్మాసంబు మొదలుమాఖమాసపర్యంతంబుస్వాతిమూలా
నురాధలనుమకరమత్స్యకర్కటరాశినివిత్తినజొన్నలపారంబుగా ఫలించునని

రెట్టండునుడి వెనని చెప్పి॥గీ॥అరయతక్కినవతుఖ్రతమట్టిరాసు । లందులనుజొన్న వి త్తినయెనగమూడు। భాగములుయెత్తినై చెడుపరగనొక్క। భాగము ఫలించునసె రెట్టభోగివరుడు॥ సీ॥ తొలుతగంధాక్షత ధూపోపహారము ల్గొబ్బుజడ్డి గమునగొనగవలయు । హర్షంబుతోజొన్న లాదిగాధాన్యము ల్విత్తినఫలియించు వెలితిలేక । విత్తుచుండెడివేళ వేగపగ్గంబైనమోకులైనను వెనమురిసెనేని।యెద్దులురొప్పగనెద్దులుబడెనేని యలపంటరాచ కార్యములచేత । జెడునుమును యెద్దుబడినదోషంబువలన । జోరులకునైన యనువును జేరుగాని। తగులుహాకావుతమ్ములనదనముమీాద। ఘట్టిగాహానియనె రెట్టఘనుడుమహిని॥ రసవాడి॥ సీ॥విత్తపోయిన వేళవిలుపై డికంటెదావలరొప్పనిలిచినవలపటికిని । గాడిదెముంగిసకాకంబుపోయినతునకంబువామదిక్కునకుజనిన । జలధిపుణ్యాంగనల్సేసలుచల్లినముదమున వేదముల్జదువుచున్న । వి త్తెడునప్పుడువృషభంబు ఎడమగాజాలు బారినమఱిచాలుదిరిగి।వచ్చునో నెద్దులువలపలదిరిగియువచ్చిగీమును జేరవచ్చుతఱిని।ధాన్యంసంబుదిర్నవారిగాగను పైర। వశ్యంబుఫలియించు చక్కగాను। రెట్టకవివర్యుడీరీతిమట్టుదెలిసి। ఘట్టిగాబల్కెనిలలోనదిట్టడగుచు। సరసులెల్లనువినిచాలసంతసింప । యార్థికల్పకవర వేంకటాద్రివర్య॥ గీ॥ కవియుసౌమ్యుండునున్నలగ్నమునరవియు । వారలున్నట్టియానవాంశములనైన। ఇవ్వసుంధరిగలధాన్యమెద్దియైన। వి త్తినఫలించుకొండ్రాజువేంకటేంద్ర॥ చ॥ అమరగురుండు లగ్నమున నందువసింపగ విత్తుట ల్పతుర్థమందులమెలంగుపైరుతతిదప్పక యుండుట సప్తమంబునం । దమరగవేగినాపయిరులాయతపెట్టుట మంచిదెంతయుఁ । విమలగుణాఢ్యతిమ్మ పృథివీపతి వేంకటరాజశేఖరా॥ సీ॥ కోరిపండినపంటగోయబోయెడు వేళవలపంటగాకంబువచ్చిమఱియు । బట్టువట్టువరత భాగంబునందునచేష్టలుగావింపజేసికట్టు । మేటి యేనుంగులుమించుటద్దంబులునవటికంబంబులునట్లుపూర్ణ । కలశంబులునువన్నెగట్టినకోకలువీక్షిస్పధాన్యసువృద్ధిమఱియు నట్టిధాన్యంబులలరుటలంత లేక । ఇల్లుజేరునుకాపులకింపుమీాఱ। రసికమందారపెదతిమ్మరాట్కుమార । వెంకటక్ష్మాపసర్వదిగ్విపతభూపా॥ గీ॥ పయిరుగోయబోవపాటించవిధవకు । దేలునగ్నికసువుతెలకజాతి । వారిజూచిరేని వారికినాపంట । దక్కదనియె రెట్టడుక్కులలర॥

## అర్ఘలక్షణము.

సీ॥ భావించిచూడయమావాస్యయందింద్రధనువు వానయు కర్జితంబుమెరుపు। గాలియుమొదలుగాగలదశధాతువు ల్మఱియునుపరివేషమండలమున।నల్లనిరేఖలునలువొందనుండినయగ్గువగుగురుధాన్యంబుమిగుల। వరుసచెప్పినగురుతులాదినమునగాకతక్కినవాడు గలిగియున్న । విస్మయంబావహీనుర్వీతలమున । దామరముసంభవించు దృఢంబుగాను । ననియు రెట్టడుసకల

విద్యావిమంతు। వినుముకొండ్రాజతిమ్మయ వేంకటేంద్ర॥ సీ॥ క్రమముతో చై
త్రమాసముననమావాస్య పద్మమిత్రుడువృషభప్రవేశ। మునునొందనాగురు
తులునుండెనావెసపరువడిలెస్సగఫలము జెందు। కందమూలాదులుగలుగునా
నెలలోనధారుణిదరుగదుధరనుమఱియు। వైశాఖముననమావాస్యనురవిమి
థునము జేరనట్టిచిహ్నములుగల్గ। కొలుచులవణాదు దిరసవర్గములదఱిగి।
యమ్మషాణ్మాసపర్యంతమున్నతముగ। నుర్విలోపల రత్నాకరునిమతంబు।
వినుముకొండ్రాజతిమ్మయ వేంకటేంద్ర॥ గీ॥ వరుస జ్యేష్ఠంబునందమావాస్య
నట్టిచిహ్నములుగల్గియున్ననీక్షితినిధాన్య। చయముకడునగ్గనయియుండుజను
లుచెలగ।వినుముకొండ్రాజతిమ్మయ వేంకటేంద్ర॥ సీ॥ ఆషాఢమాసంబునంద
మావాస్యనుదెలియనాగురుతులేగలిగియున్న। ఘృతముతేనియనూనెశ్రీగం
ధమును మొదలైనవస్తువులునాదినమునందు। గొనిదాచనరువదిదినములనాటి
కినినుమడిలాభమౌనిన్నెచూడ। శ్రావణమాసంబు జంద్రభానులుగూడబూ
ర్వోక్తచిహ్నముల్పొసగియున్న।నాదినములందుసశ్వముల్మదగజములు పైడివెం
డియుమరకతప్రభృతిమణులు। గొనగమఱియైదు నెలలకునినుమడిగను। లాభ
మొసగును వేంకటరాజచంద్ర॥ సీ॥ భాద్రపదంబునబరగు నమావాస్యనాచి
హ్నములుగలనాటిదినము।జొన్నలులోహముల్లోకతో గొనిదాచమాసత్రయం
బునమడుగురెట్టి। యాశ్వీజమాసంబునందమావాస్యను మునుపటిగురుతులు
మొనసియున్న। నూలును మాణిక్యములును కంబళ్లుకుంకుమ కుసుంబపువ్వు
ల్గొనిననెలకు। లాభమినుమడిసేయవోలాభనిరతు। డగుచుశ్రీసూర్యనారా
యణాంఘ్రిపద్మ। వందనాసక్తుడగురెట్టడందముగను। వినుముకొండ్రాజతిమ్మ
య వేంకటేంద్ర॥ సీ॥ అరయకార్తీక యమావాస్యరాశిమశ్చికవృశ్చికగ్రహ
రాజువచ్చి।యుండగతొలిగు ర్తులొగిగల్గియుండిన శ్రీగంధమూలాదిబృందము
లను। గురియైనరత్నముల్ గొనినమాసత్రయమునకవిఫలియించు నినుమడి
గను। రహిమించుమార్గశీర్షమ్మునమావాస్య కినుడుధనూరాశికేగుదేర।
నట్టిగురుతులుగనుపింప నట్టియపుడు। శంకుపగడంబుముత్యము ల్కుంకుమ
యును। గొనినషాణ్మాసమునకిందుకినుమడిగను। గలదులాభంబువినుము వేంక
టనృపాల॥ సీ॥ పౌషమాసంబునబఱగునమావాస్యమకరంబునైనకుంభమున
నయిన। దినరాజుచేరంగమునుపటిగురుతులుగనిపించధాన్యలోహనికరంబు।
గొనిరెండునెలలకమ్మినను నినుమడిలాభ మౌనెంచిచూడంగ మాఘమాస।
మునసమావాస్యమీనము జెందనినుడుతొల్లిటిచిహ్నములులెస్సదోచెనేని। కం
దమూలములునుమానికములు వినుము। ననుములునురసచయములునప్పుడు
కొనిన। యారునెలలకునమ్మినయందువలన। వినుముమ్మడిధనమగు వేంకటేం
ద్ర॥ సీ॥ పొలుపొందుఫాల్గుణంబుననమావాస్యనాడలతొంటిగురుతులుమల

రెసేని । * దవనంబుగొనిమఱిదగ నాల్గు నెలలున్న మీఁదనమ్మినలాభ మినుమడి
యగు। నయ్యమావాస్యయునందు పాపగ్రహములువచ్చినను దారణలుఁ గొడ
వగు । నందుశుభగ్రహం బలరంగనున్నను నెరిగొల్చినగ్గునా నిక్కముగను।
నయ్యమావాస్య ముప్పది దినంబులనైన మంచిది ముప్పదియహములకును।
దక్కువైయున్న గాదదిధారుణికిని। మించియుండినశుభమగు మేటిప్రజకు। నని
యెరెట్టడుసకలవిద్యావిభుండు। వినుముకొండ్రాజుతిమ్మయ వేంకటేంద్ర॥ సీ॥
పున్నమరాత్రిసన్నపుటురుమునుతుంపరవానయుధూమ్రవర్ణ। మగుపరివేషం
బునంధకారముగప్పిపొగబొలినట్లున్న మొగులలోన। నాడాడ రెండునునొండు
చుక్కలుగానబలభేదిచాపంబునలుగడలను। మెరుపులుగలిగిన మేదినిధారణ
ల్జాలంగగల్గునచ్చైత్రశుద్ధ।పున్నమరాత్రినాచిహ్నములల్గినధాన్యంబుప్రత్తియు
దాచవలయు। నెసగనాల్గవ నెలకమ్మనినుమడించు।నని యెరెట్టడుదిట్టడై నాడె
ముగను।సరసులకువారకానననాటివినుము। వేంకటక్ష్మాతలేంద్రభూమినుత
కీర్తి॥ సీ॥ పొందుగవైశాఖపున్నమరాత్రిరిగుర్తులుండినబత్తికుసుమపెసలు।కరి
మళ్ద్రవ్యముల్బహుళంబుగాగొని యెనిమిది నెలలకమ్మినఫలంబు। లష్టగుణం
బగునట జ్యేష్టమాసపుపూర్ణమనాడు నాపోల్కియుండ । గొనికొల్వు నాల్గు
గాదనగు నెలలకుసమ్మ లాభమిన్మడియగు రాచకార్య। ములు గలుగుసరియు
నాషాఢపూర్ణమాస్య । గురుతుగల్గినరాగులుగోధుమలును । యవలుగొని
యున్న త్రిగుణమానందుఫలము। నాల్గు నెలలకు వేంకటనరవరేణ్య॥ సీ॥ శ్రావ
ణపూర్ణిమరాత్రినాగురుతులు గలిగినదైలాబుకందమూల। ఫలములుకొని
యున్న నెలనాటికిలనొక పాటిఫలములుగల్గు భాద్రపదము। నందుపున్నమ
తేయి యాగుర్తులునుగల్గకైదువుల్సినంబుగంధకంబు । ముత్తియంబులుబాణ
ములుతుపాకులు పెటులుప్పుధాన్యముగొనియుండబిదప। మెఱసియెనిమిది
నెలలకమ్మిననష్ట। గుణములాభంబుగల్గునిక్కమముచూడు। భానువంశప్ర
దీపశుంభత్ప్రతాప।విశ్వముకొండ్రాజుతిమ్మయ వేంకటేంద్ర॥ సీ॥ ఆశ్వీజమా
సంబునందుబున్నమతేయి నాగురుతులుగల్గునాడు దేవ । గోధుమల్వరిగెలు
కొఱ్ఱలు నెయ్యిసిగొను నాల్గు నెలకమ్మనమువ్రుగాను। బరగగనైదుపాళ్లరయులా
భముగల్గు రెట్టమతంబిది గట్టిగాను । కార్తీకపున్నమి కడు వేడ్కరజనినిమును
పటిగురుతులుగనుటవేగ । విల్లునంబువకంబళ్లునలరువరుల । కొలుచుబగ
డంబుసౌవర్ణములనుగొనిన।నారు నెలలకునమ్మిన నైదుపాళ్లు।లాభ మొనగూడు
తిమ్మభూరాట్కుమార॥ సీ॥ చెలువుమీఱగమార్గశీర్ష పౌర్ణమియందె దొలు
తటిగురుతులుగలిగియున్న । చక్కెరతేనెయాజ్యముశొంఠిగొనినాల్గు నెలలక
మ్మినజాలఫలముగలుగు। పౌషపౌర్ణమిమునుపటిగురుతులున్నను క్రమముకంబు

* దవనమనఁగా ధాన్యవిశేషము.

లభినికుంకుమయుతగర । మగుదైనవన్నెలుపరిమళ ద్రవ్యముల్గొనినమాసత్ర
యంబునకునైదు । పాళ్ళులాభంబుచేకూరుపరగమాఘ । పౌర్ణమావాస్యనా
చిహ్నములునుగలుగ। గొలుచురసవర్గములుగొన్న నెలలుమూట। నధికఫల
మగు శ్రీవేంకటాద్రిభూప॥ చ॥ పనివడితొంటిచిహ్నములు ఫాల్గుణపున్నమ
యంపురాతిరిం। గనుబడియున్నగంధకముకంచు ఫలంబులుకన్దమూలముల్ ।
గొనియుట సప్తమాసమునకుం గ్రయమిచ్చిన లాభమొప్పగా । నినుమడి
యౌనుతిమ్మధరణీశ్వర వేంకటరాజశేఖరా॥సీ॥రాజిల్లునలమీనరాశిపున్నమ
నాడుయేడుగ్రహంబులుగూడెనేని। ప్రజలకుహానియౌద్విజరాజు నాశుభగ్ర
హములుజూచినగల్గుశుభము । ధాగణహెచ్చు క్రూరగ్రహంబులు గనుగొ
న్నధరయధికంబుదఱుగుభువిని । నొక్కమఱిమీఁదిగానుపున్నమమున్పదిదివసం
బులైననుదృఢముగాగ । సమముధారణనొక్కఘస్రంబుకొరత। యయినధా
రణమరితక్కువగునునొక్క। దినమధికమైనధారణఘనముగాగ । నగ్గువౌనని
రెట్టనయ్యార్యసుతుఁడు॥

## గ్రహణలక్షణము.

సీ॥ ఉత్తరాషాఢయునుత్తరాభాద్రయుహస్తపుసర్వసునశ్వినులును।
చిత్తనుత్తరయును జెలగినియ్యేడుతారలవాయుదిశనుండిగ్రహణమైన। నరుల
కుచిన్నవాండ్లకువ్యాధిగల్గును ధాన్యంబుదఱుగుయుద్ధంబులగును।కోపంబు
బహుళంబుగొంచవానయుతర్కించిచూడఁగధరణియందు । సరవినేజెప్పి
నట్టిదోషములలోన । నొక్కటైననుగలిగినసుర్వియందు। నత్యుదగ్రతపక్షత్ర
యమ్ములోన। ననియెరెట్టడుసకలవిద్యావిదుండు॥ సీ॥ జ్యేష్ఠపూర్వాభాద్రకృ
త్తికభరణిపుష్యంబును మఖయు విశాఖయనెడు । నలసప్తతారలనాగ్నేయ
మందునగ్రహణమైననుశిశుప్రకరములకు । వ్యాధులువోడముధాన్యంబులుద
ఱుగునుజాళ్ళవానయునెండరాచబాధ।ఘనమగువర్షంబుగలుగు కేవలమును
గురియకుండునువృష్టిగువలయమున। సరవినేజెప్పినట్టిదోషములలోన।ననియె
రెట్టడువేంకటావనినరేంద్ర॥ సీ॥ స్వాతిపూర్వాషాఢశతతారయాశ్లేషయార్ద్రి
రేవతిపుబ్బలనెడుసప్తనక్షత్రములయందు నైఋతిదిశనుండిగ్రహణమైననుశి
శుప్రకరములకుహానియాగోపంబులలరుదీర్పయిరెండిసోవునసూరాధశ్రవణ
ములను । నభిజిద్ధనిష్ఠయుమృగశీర్షమూలరోహిణులనగా భువివెలయునట్టి ।
యేడునక్షత్రములయందు నెంచిచూడ। కడగియీశాన్యదిశనుండి గ్రహణమై
న। క్షోణిప్రజలకునెంతయుశుభముదనరు। ననియె రెట్టడు సకలవిద్యావిధుండు॥

## ఆకస్మికలక్షణము.

గీ॥ చైత్రమునజ్యేష్ఠఫాల్గుణ శ్రవణములను । నర్కసోమోపరాగంబులై
నరుజలు।భూభ్రమణమద్భుతంబులుపుట్టుధరణి । నాయకులునొత్తురనెరెట్టన
ప్రభుండు॥ క॥ఒకమాసంబునసోమది।నకర గ్రహణంబులైననగుజగడంబుల్ ।

సకలనృపులునొత్తురుపా। యకశోణితనదులుపారున నెరెట్టడిలక॥ సీ॥శిశువులు
ముదముగా జెరువులుగట్టినవట్టిగుంటను దేమబుట్టె నేని। గుడకుంభమునునుప్పు
కడవ ద్రవించిన శిఖయాడుచును గూత జేసె నేని। చీమలగమిగుడ్లతో మిట్టలె
క్కినఁ గకుబంతముల మంచుగప్పె నేని। మేఘంబుజలములమీద కుండలదొం
తులొండొండ బెట్టినట్లుండె నేని। కూడియందందదూనిమలాడె నేని। యంబు
ఘటముర్వియిడజారమ్మనియె నేని। గలుగుబహువృష్టి యాకస్మికంబుగాగ। ది
మ్మభూపాల వేంకటాద్రిక్షితీంద్ర॥ వ॥ మఱియు నెప్పుడుతప్పక పట్టెడుపట్టెసం
బు రేపకడబట్టిజూచినదుప్పుబట్టి యుండినను శునకంబులు గృహంబులమీద
నునదీతటాకమధ్యంబులయందునుగూతలు పెట్టినను అడవీగెలుపశువులుదరిమి
తరిమిగరచినను నోగిరంబు వేగిరంబ బాగుదప్పినను పిచ్చుకలు మొదలగుపు
లుగులబలగంబులు పచ్చికె విచ్చలవిడి మేయుచున్నను పొడిమట్టిలో జంట
గూడిపొరలినను శుకనికరంబులు సుఖకరంబులగు తమతమగూళ్ళువిడిచి యా
కసంబున కెగసినను కాకులాకసంబున కెగరినను మిన్నుజూచినను ఱెక్కలార్చి
నను పిల్లులుల్లంబున నుల్లడికొని ముల్లంబున నేలమూర్కొనుచు బుస్సుబు
స్సురనినను నల్లనియీగెలు మ్రోతతో తోపులగట్టున నీటిపై మ్రోగినను
పుడమినడుమబుడబుడబొంగినను భుజగవ్రజంబులు కుంజపుంటంబుల నెక్కి
నను గొఱియకదుపులం తమస్థలంబుననుండి మిట్టకెక్కినను జలంబులనుండి
మత్స్యంబులు బైటపడినను బడినజలచరంబులు చవిచెడినను మృగప్రకరం
బులు తలలువంచికూతలిడినను శరీరంబులు గదలించుచుండినను మాపటివేళ
తేలు సక్క యిత్రిపాము వూసరవెల్లి బల్లి మొదలగునవి పులివలెగూర్చుం
డినను శరీరంబుగదలించినను ఆకులుదిననిమ్మృగంబు లాకులుదినుచు తమతమ
నెలవులనిల్చినను పక్షులుసమీపంబుననున్నగ్రుడ్లు మిట్టలబెట్టినను వర్షంబు
గలదని రెట్టడునిశ్చయించి చెప్పె॥ చ॥ జనపతి వానకై కడువిచారము నొందగ
నీరుకోళ్ళుగొబ్బున దివినుండియచ్చటను భూమికి వ్రాలిన మారుతంబుక్ర।
న్ననధర మ్రోవగా విసరినం గురియుం బహువృష్టి తుష్టిగా। వనధిగభీరతిమ్మ
నృపవర్యుని వేంకటరాజశేఖరా॥ క॥ ధరణీచక్రంబదగగ। నురుముచువీచినను
ప్రజలకొదువునరోగో। త్కరములు దుర్భిక్షాదులు। కరమరుదుగనసియె రెట్ట
కందర్పుడిలక॥ సీ॥ పరగగా త్రైలయాదు పగలువర్షింపంగ రాత్రులనధికవర్షం
బుగలిగి: వివరింపనాకా త్రై వెడలిపోయెడు తొలినాటిదినంబున సరులుజాడ।
సర్కమండలమెల్లనయిపరివేషంబు గట్టినట్లుండినగమలహితుని। కలములప్పు
డువానకాళ్ళచందంబునగనుపించినను నిక్కవంబుగాను। ధారుణీనాయకులకు
తథ్యంబుగాగ। నఖిలదిక్కులయందును నా త్రియుడవు। పంటవలతిక్రేవేగదుఃపం
టలెసగు। గాడకీర్తిప్రతాప వేంకటమహీశ॥ గీ॥ గొప్పవడగండ్లుబడగ నెక్కు

డుగనపుడె । గాలివిసరంగ బిడుగులు నేలఁ బ్రాలు । గ్రూరముగ రక్తవర్షంబు గురిసె నేని । పుట్టు దుర్భిక్షదశ యనె రెట్టడిలను॥ క॥ అరుణోదయమున వర్షము। గురియగ కడు నెట్టనైన క్రొమ్మొయిలుగ సరం । బొరిపొరిపిడుగులు వ్రాలిన। ధరణీశులు నొత్తునని యెవా రెట్టడిలర॥ మ॥ అహితాగస్త్యచయాగ్నికీలనయ రేఖాచార్యపరంశాశస । త్యహరిశ్చంద్ర కటాక్షసంగత దయాత్రాణార్థిజాలారిశా । నహరీదంతరకీర్తిచందనస రేశ శ్రేష్ఠయత్యంతధ । వ్యహరిధ్యానగరిష్ఠహృన్నళినదానత్రాత్ర తేజోనిధీ॥ పంచచామరం॥ క్షమాధృతక్షమామహాభుజాపరాక్రమక్రమా । కుమారకల్పదానకల్పకుంభినీశ పావసం । గ్రమావధూమణీకుమారతంసకాంతిపంకజా । హితాసమానకౌరనాథినాధస త్పతీశ్వరా॥

గద్య॥ ఇది శ్రీమదొంటిమిట్ట రఘువీరకృపాలబ్ధసాంసారత్వధుర్యాయ్యలరాజవంశసంభ వాయ్యలాఖ్య భాస్కరాఖ్య కవిద్వయప్రణీతం బగు రెట్టమతశాస్త్రంబునందు తృతీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీరస్తు.

# రెట్టమతశాస్త్రము.

## చతుర్థాశ్వాసము.

శ్రీవిమలతారహారోంబల । దేవకథావర్ణనైకదిగరిమధన దీ। పావనగుణభూషణభ। ద్రావహ కొండ్రాజు వేంకటాద్రినరేంద్రా॥

### గ్రహచార లక్షణము.

సీ॥ ఒకరాశి నెలయుండు నొప్పుగా సూర్యుండు బుధభార్గవు ల్మఱిభూమిజుండు। నెలమీద నరయుండు నిర్జరాచార్యుండు పదిరెండు నెలలుండు భానుజుండు। ముప్పదినెలలుండు మొగి రాహు కేతువు లిరువది నెలలుండు హిమకరుండు । తర్కింపనటదినద్వయమును పది హేను గడియలు జగతిప్రఖ్యాతము గను। క్రమముతోడుత గ్రహముల గతులు దెలిసి । తెలుపవలయును శుభములు ధీరవరులు। జన్య నిశ్శంక జగదభిశాసనాంక । ప్రాభవోపేంద్ర కొండ్రాజుపార్థివేంద్ర॥ క॥ హిమభూధరంబు మొదలుగ । విమలస్థితిమించు జాహ్నవీనదిదనుకా। నమృతాంశుతనయక్షేత్రము। విమలాభేద్యప్రతాప వేంకటభూపా॥ క॥ అలవింధ్యశిఖరియాదిగ। కలుషప్రజరహితమైన గౌతమిదనుకా। దలపగ శుక్లక్షేత్రము। యలఘుబలాటోప వేంకటాద్రిమహీపా॥ క॥ గురుతుగ దురితోత్కరసంత।హారమగు నాపరమగన్గయాదిగ లంకా । పురిదను కకుజక్షేత్రము । హారిభక్తివిశాల వేంకటాద్రినృపాల॥ క॥ ఒకరాశి నిశనియుంగా । రకులుండిన కరువు వదోచు రాజుల జుదగం। బ్రకటంబగు బహుకలహము । అకలంకగుణాఢ్య వేంకటాద్రిమభూపా॥ గీ॥ కడిగి యొక్కరాశి గ్రహములు మూడున్ను । రాజులకును నాల్గు గ్రహములు

